


# సత్యవతీ శతకము.

—:o:—

మ॥ హై॥ వకీల్, బి. ఏ., బి ఎల్ ., శ్రీ

రెంటాల-వేంకట సుబ్బారాయ ప్రణీతము.

[రెండవకూర్పు]

వెల 1 అణా.

విక్టోరియా డిపో - మైలాపూరు - మద్రాసు.

1910



TRADE MARK

# అమృతోదయము.

డబ్బి **8** అణాలు. పోస్టేజి **4** అణాలు.

**6** డబ్బీలు - రూ. **2-8.** డజను, రూ. **4-8.**

ఇది మంచి పరిమళమును ఘాటునుగలిగి వెన్నవలె నుండును. దగ్గు, పడిసెము, తలనొప్పులు, పార్శ్వ నొప్పులు, మెడనొప్పి, గొంతునొప్పి, రొమ్మునొప్పి, నడుమునొప్పి, కీళ్లనొప్పులు, పోట్లు, వాయువు నొప్పులు, నరముల తీపులు, పట్లు, వాపులు, బెణుకులు, చీడ, తీట, దురద వగైరాలకు దేవేంద్రప్రసాదము. అమృతోదయము శరీరమును తాకినవెంటనే జిల్లుమని అమృతరసముదయించి నరములలో నాళములలో వ్యాపించి నిముషములో బాధను నివారణచేయును. చాలా ఆశ్చర్యము!!

---

విక్టోరియా డిపో - మైలాపూరు - మద్రాసు.




# సత్యవతీ శతకము.

—:o:—

మదరాసు హైకోర్టు వకీల్, బి. ఏ., బి. ఎల్
రెంటాల - వేంకట సుబ్బారాయ ప్రణీతము.

[రెండవకూర్పు]

వెల 1 అణా.

విక్టోరియా డిపో - మైలాపూరు - మద్రాసు.

PRINTED AND PUBLISHED BY R. VENKATA SUBBARAU
AT THE JANOPAKARINI PRESS
VICTORIA DEPOT, MYLAPORE, MADRAS.

1910

శ్రీ ర స్తు.

# సత్యవతీ శతకము.

———:o:———

కం. శ్రీ వాణీ శైలాత్మజ
లేవాని యనుగ్రహమ్ము నెనసి వసుధపై
నీవేసముఁ దాలిచి రా
దైవము ననుఁ బ్రోచుఁ గావుతన్ సత్యవతీ ॥ 1

కం. సుకవులు గల రెందఱో వా
రికి వందనమిడెద నాకుఁ బ్రియమగు సత్యం
బుకృతిగఁ జెప్పిన కందము
ల కందములఁ గూర్ప నెల్లెడల సత్యవతీ ॥ 2

కం. పొత్తముల్ గానరానివి
క్రొత్తవి శృంగారములను గొన్నింటిఁ గూర్తున్
మెత్తురె పెద్దలు నీతు
ల్గుత్తిగ నటువెన్కఁ గన్పడున్ సత్యవతీ ॥ 3

కం. భావించెద సత్యము నే
నీవుగ నీదైనవాణి నీ చెలియలుగా
నావర్ణనమ్ములం బెఱ
భావము లేదనఁగ నమ్మవా సత్యవతీ ॥ 4

కం. భావమునఁ బుట్టి కన్నియ
గా వన్నెలు వెట్టి నాకుఁ గడుభ్రమ గొల్పన్
భావమున నిన్నుఁ గోరఁగ
నీవే సత్యవ్రతప్రకృతి సత్యవతీ॥

కం. అలనాఁడు హరిశ్చంద్రుఁడు
పలుతెఱఁగుల సత్యమునకు బాసయయ్యెం
గలకాల మేను నీపద
ములసేవ యొనర్చు టబ్రమో సత్యవతీ॥

కం. విద్దెలు గఱచిన వారల
నుద్దులను గొఱంత యంద్రు సూనృత భావం
బద్ది పెనుఁగల్ల నీకుం
గద్దుగదా వాణి చెలియగా సత్యవతీ॥

కం. అక్కకుఁ జెల్లెలికిం గల
మక్కువ కొలఁది గణియింప మాశక్యమె వా
కొక్కటి సత్యసరస్వతు
లెక్కసకెము లాడు టెగ్గలే సత్యవతీ॥

కం. ఒక్కొకతఱి నిజమరయఁగఁ
ద్రొక్కఁదగని పథమునంటి తొలఁగింపఁబడన్
గ్రక్కున నీవు సరస్వతి
నక్కాయని చెక్కుగీటవా సత్యవతీ॥

కం. సత్యమునందు సరస్వతి
నిత్యము ప్రబలంగఁ గాంచి నిష్ఠురశీలీ
సత్యమునందు సరస్వతి
యత్యంతము మైత్రిచిత్రమా సత్యవతీ॥ 10

కం. మును పుట్టిన నీకన్నను
ఘనమై మఱి భూషణములు కడు గనుపడుచుం
దనరారుఁ జెలి సరస్వతి
కనవే నీజోడు చూడఁగా సత్యవతీ॥ 11

కం. తులఁదూఁగనేల నేనీ
తులఁదూఁగుదును నీవు నాకుఁ దులఁదూఁగుదువు గా
బలువా సరస్వతికి నం
జలి సేయుదుఁ గావవమ్మ సఖి సత్యవతీ॥ 12

కం. పొలఁతీ నీ చెక్కిళులం
గల చెలువముగాంచి పండ్లుగా భ్రమఁగొంటిన్
వెలకుం గొనరాదని వ్యా
కుల మొదవెనదెట్లు పోనొకో సత్యవతీ॥ 13

కం. పగవాఁడ నఁటవె నీలే
నగవుల నాయుసురుఁ బీల్చ న్యాయమె సరిపో
తగ వేల మఱి యుసురు నీ
పగడంపుఁ బెదవులనె పోయవా సత్యవతీ॥ 14

కం. కలికీ నీ నాలుకపైఁ
బలుకుఁలచెలి నిలిచె నీదు వాగమృతసుధా
రలఁ గ్రోలనీవె నాయాఁ
కలి దీఱఁగ నీకు మేలుగా సత్యవతీ ॥

కం. కన్నుల తెన్నుల నెన్నఁగ
మున్నుగ దయ పిదప హృదయమును గంభీరం
బున్నతి చెలిమియు విజయం
బిన్నియుఁ గన్నాఁడఁ గాదఁటే సత్యవతీ॥

కం. కురులు విరియఁ బోసితి బం
గరుమోమున బొట్టు లేదు గనరా దొకయా
భరణము కినుకయు నందమె
చిరుగడ్డముఁ బట్టనీవె చెలి సత్యవతీ॥

కం. సదయస్ఫురిత నిష్కారణ
ముదయింపఁగ నేల కోప మొక్కొకతఱి నీ
హృదయమ్ము కఠినముగ నా
హృదయమ్మునఁ దోఁచుచుండదే సత్యవతీ ॥

కం. అఱచేతులు నఱుగులుఁ గనఁ
గఱవెట్టులఁ దీఱు రెండుకనులకు నద్దా
మఱి ముద్దిడ వర మొసఁగుము
నెఱదాతగఁ బ్రస్తుతింతు నిను సత్యవతీ ॥

కం. పలుతెలుఁగుల నీ చెలువము
వెలువడి నా హృదయ మంటె వేవిధముల నన్
బొలియించుట గనవా దు
వ్వాలువలు చాటని తలంతువా సత్యవతీ॥ 20

కం. కథలందలి మాటయ్యేను
విధాత చెలిపాట నీదు వీణాపలుకులున్
మధురంబౌ గానము విన
బధిరునకుం జెలువు చక్కఁబడు సత్యవతీ॥ 21

కం. ముద్దుల మూటలు మాటలు
తద్దయు నిక్షేపములుగదా నీసీటుల్
పెద్దగు కోటలు గుణములు
కద్దా నీసాటి బోటి గన సత్యవతీ॥ 22

కం. నీ ప్రేమకుఁ బ్రణమిల్లెద
నీ ప్రజ్ఞకు సంతసిల్లి నిను స్తుతియింతున్
నీప్రౌఢిమ ప్రత్యక్షమ
నీప్రతి నే నెందుఁ గందునే సత్యవతీ॥ 23

కం. ముద్దియ యేమందును నీ
ముద్దులు మురిపెములు హృదిని ముద్రలుగా నే
ప్రొద్దును నీ తలఁపే కద
నిద్దురలోఁగూడ మఱవ నే సత్యవతీ॥ 24

కం. నినుఁ గనక మున్ను నాకీ
ఘనసృష్టి సమస్త మొప్పెఁ గానసముగ నీ
వెనలేని ప్రేమ గదియఁగఁ
దనరెడిఁ బూఁదోటగా సదా సత్యవతీ ॥ 2

కం. పెనుమంత్రము వెట్టితివో
నిను నిముసం బేని విడిచి నిలువఁగ నాకున్
మనసొప్పదు మునిముచ్చువు
మునుమున్నె కొంటి హృదయమును సత్యవతీ ॥ 2

కం. వాలుంగన్నుల చెలి నన్
వేలగఁ జేసితివి నీదు ప్రీతి మెయి న్నీ
మ్రోలఁబడితి నను నీటను
పాలనె ముంచుటకేఁ దెల్పవా సత్యవతీ ॥ 2'

కం. ఏమియుఁ బలుకవు ముద్దవో
కో మదికిఁ బ్రియంబుగావొకో నాదుమొఱల్
నామోమునంకఁ జూఁపుము
భామామణి చూడనొల్లవా సత్యవతీ ॥ 28

కం. ఒకమెతుకుఁ బట్టి చూచినఁ
బ్రకటంబగుఁ బాకవిధము పాలింపుము న
న్నిఁకనైన లేక తెల్పుము
మొకమోటము వీడి నిక్కమును సత్యవతీ ॥ 29

కం. అరమఱికలు విడుమమ్మా
కరుణింపగదమ్మ కొమ్మ కనకపుబొమ్మా
వరమిమ్మా మానము నా
మరణమ్మగు నమ్మ చారుమతి సత్యవతీ ॥ 30

కం. ఒకతఱి సమ్మోదము వే
ఱొకతఱి సందేహమును మఱొకతఱి నేస్తం
బొకతఱి మఱియాదయుఁ గద
యకటకటా యేది నిశ్చయమొ సత్యవతీ ॥ 31

కం. ఏలా నామదికిఁ బ్రియము
బాలా యొనగూర్చి తీపు బాధింపఁగ నా
చాలుం జాలు సుశీలునిఁ
గాలుని పాల్సేయఁ బాతకము సత్యవతీ ॥ 32

కం. నీలావణ్యముఁ గని నే
బేలనయితేఁగాని నీకుఁ బ్రియమోటు నాపైఁ
జాలఁగలుగుఁ బసిబాలవొ
గోలల నమ్మంగ జనునొకో సత్యవతీ ॥ 33

కం. మగవారికిఁ బగవారనఁ
దగియుందురు మగువ లెపుడు తమనేర్పు మెయిన్
వగవలపు సూపి నమ్మఁగ
నగుదురు లోలోనఁ జాటునన్ సత్యవతీ ॥ 34

కం. రెట్టింపసేల స్త్రీలకుఁ
బుట్టిల్లగు బూటకంబు పురుషులకును వా
రెట్టెట్టఁ పంగనామము
వెట్టుదు రిది నిజము నిజము విను సత్యవతీ ॥ 3

కం. వేసము మోసము దోసము
గాసముగాఁ బెరఁగి ముఖ వికాసమ్మున రం
భాసమలు రమలు వారిక
రోసము గలవాఁడు రోయునో సత్యవతీ ॥ 3

కం. కనుమూయ నంతలోనను
మనసుం గరఁగింత్రు మాయమాటలచే నం
గన లౌర వారి పల్కుల
ననవరతము తేనె లొల్కవా సత్యవతీ ॥ 3

కం. జనసమ్మతమ్ము మతమని
తనవారని మదిఁ దలఁపక ధనముఁ ఘనముఁ
దునియఁగ నెందఱు తమగతిఁ
గన రొక్కక తలిరుఁబోఁడికై సత్యవతీ ॥ 3

కం. ఇన్నియు నెఱింగి యే నే
తెన్నున నీయందుఁ గొంటెఁ దీఱని ప్రేమం
బన్నా యెవ్వని బుద్ధియు
సున్నగుఁగా స్త్రీలు నిల్చుచో సత్యవతీ ॥ 38

కం. సారెకు నీ సొగసుల కుప
చారమ్ములు సలిపితిని విచారము వోవన్
గెరితిఁ దుది దూఱితి నో
రారా నీగుండె కొండయగా సత్యవతీ॥ 40

కం. తగునే బిగువులు నన్నిటు
ల గేలిసేయుటయు మేలె లాఁతి నయితినే
వెగటయ్యెనె చెలిమియుఁ గేల్
మొగిచితి మన్నించు నేరముల సత్యవతీ॥ 41

కం. హెచ్చుగఁ గోపముఁ బూనితి
వచ్చెరువౌ నీదు చెలిమి వ్యాపారమ్ముల్
మెచ్చితి మది నొచ్చితి మన
ముచ్చట మూన్నాళ్ల ముగిపెముగ సత్యవతీ॥ 42

కం. కలనెఱఁగు నవిస్తరముగఁ
బలికితి మఱి పలువిధముల బాసలు సేయన్
దెలిపితి హృదయ మిదంతయుఁ
గల యయ్యెఁగ చూడఁ జూడఁగా సత్యవతీ॥ 43

కం. నాజీవాధారం బిది
గో జతయని తలఁప మదిని గొంతెమ కోర్కెల్
రాజిల్లెఁ బెల్లుగా నవి
యీ జన్మమునందుఁ జెల్లవే సత్యవతీ॥ 44

కం. ఏలా పుట్టితి భువిపై
నేలా నీయట్టి సఖియ నీక్షించితి నే
నేలా యుండని పండుల
కీలాగున నాసగొంటినే సత్యవతీ॥ 4

కం. ఏ పాపము చేసితినో
యీపగిదిం జింత గలిగె నెటు సైతునొకా
నీపైని ప్రేమచేఁ బరి
తాపమ్మునఁ గుములుచుండెదఁగా సత్యవతీ॥ 4

కం. ఏ నిర్భాగ్యుఁడ నైతిం
గానీ నీవేమిసేతు కర్మ ఫలము న
న్నానదు గతికానదు నీ
కైనను విధి సుఖమొసంగదా సత్యవతీ॥ 4'

కం. సెలవిమ్ము చెలియ మన ప
ల్కుల బాసలనెల్ల మఱచి కోపము విడి ని
చ్చలు గాంచు మఖిల సౌఖ్యము
సెలవిమ్మా మోముఁజూచి చెలి సత్యవతీ॥ 48

కం. ఇది యేమి వింత కనులం
దుదయించెడి నశ్రుధార లూరక యెటు నీ
మదినంటె విచారము నీ
హృది యతికఠినమ్ముగాదఁటే సత్యవతీ॥ 49

కం. నిండిన దుఃఖమ్మున నే
గుండె పగిలియుండ నిప్డుఁ గుందెద వకటా
పుండుపయి దెబ్బ చందమ
నుండె నయో యెట్టు లోర్తునో సత్యవతీ॥ 50

కం. బాలా, గోలా బేలా
యేలా యుల్లమ్ము దాన వింతియకా సి
తాలిమి హృదిఁ గదియుము ము
త్యాలసరము లివె ధరింపుమా సత్యవతీ॥ 51

కం. కన్నీట జలక మబ్బెను
గన్నరో మన ప్రేమలకుఁ బ్రకాశము పొదలన్
గన్నావు గాదె విరులకు
వన్నెలు హిమబిందువుల కృపన్ సత్యవతీ॥ 52

కం. చాలింపు మేడ్పు నిను నేఁ
దూలఁగ నాడితినిఁగాదె ఓయ్యాలి యదియున్
మేలమ్యోను సత్యము నా
పాలిఁటి దైవమ్ము బయలువడె సత్యవతీ॥ 53

కం. బోటీ నినుఁ గల్వఁగ నే
పాటిని హృది హృదినిఁ బొందుపఱచితి విట్లు నీ
మేటిదయ వడయ నృపతులు
కోటి వరాలైన నీరాకో సత్యవతీ॥ 54

కం. నీదుఃఖమె నాదుఃఖము
నీదూషణ నాయెడం గనెడి దూషణగా
నీదగు కష్టము నష్టము
నాదిగదా చింతసెల్లునా సత్యవతీ ॥ ℓ

కం. నినుఁ బరిహాసము సేయం
గొనకొంటిని మున్ను మున్ను కూరిమి పొగలఁ
బెనఁగొనె నీ పేరిమి యిపు
డినుమడి నీ సేవ సేయనే సత్యవతీ ॥ 5

కం. ఆటాడునపుడు నీపై
నోటము దప్పింప నెరుల నోడింతును ము
న్నాటికి నే నోడుదు నీ
యోటు హృదికిఁ బోటు సేయదో సత్యవతీ ॥ 5

కం. నీతోటి యాటపాటలు
చేతోవీధికిని మేలు శృంగారమ్ముల్
ప్రాఁతపడ వెన్నఁడును నీ
ప్రీతిం బెరఁగించు మాధురిని సత్యవతీ ॥ 5

కం వే యేలనే లతాంగి
నీ యతులిత గుణవిభవము నేఁగన్న మొదల్
రేయుంబవళ్లు నిన్నెడఁ
బాయక యుందుఁగదె నీడవలె సత్యవతీ ॥ 5

కం. నీ ప్రేమయు నే నెఱుఁగ నె
యేప్రొద్దును నన్ను విడువ నిష్టపడవుగా
నీప్రాణ మెపుడు నా హృది
నే ప్రతిబింబంబు నంద దే సత్యవతీ ॥ 60

కం. మనఃముచ్చటలకు మాసము
లును వత్సరములు యుగమ్ములుం జాలు నె భా
విని నీటికిబలె వానికిఁ
గనదంత మిదక్క జమ్ముగా సత్యవతీ ॥ 61

కం. నాతప్పా నీతప్పా
యేతీరున గల్గె మనల కింత ప్రియం బీ
ప్రీతిం బొడమాపుదమన
నాతరమా నీ తరమ్ము నా సత్యవతీ ॥ 62

కం. ముద్దిమ్ము ముద్దుగుమ్మా
వద్దమ్మా చింత మన వివాహంబహహా
ముద్దియ యెందుల కేగితి
వద్దిర చేఁజేత నుండవా సత్యవతీ ॥ 63

కం. ఒప్పులకుప్పా నీకిది
మెప్పా నీమీదఁ గూరిమింగనఁ దప్పా
చెప్పక యీ చొప్పునఁ బోఁ
గొప్పా రారమ్ము జాలిఁగొని సత్యవతీ ॥ 64

కం. రారమ్మ నాదు హృదయమ
రారమ్మా ప్రాణధనమ రారమ్మా న
న్నీరీతిం బరిమార్చుట
క్రూరముసూ రమ్మ కొమ్మరో సత్యవతీ ॥

కం ఇదియేమి మాయ యిప్పుడె
హృదినుండవె యింతలోన నెట కేగితివే
తుది నొక పలుకాడక న
న్నదృష్ట హీనునిఁగఁ జేసితా సత్యవతీ ॥

కం. నీకృప గల్గినతరి నినుఁ
జేకొన కిట్టట్టు కొంత చింతించితిఁగా
నాకర్థము ప్రారబ్ధం
బే కాకిగ నన్నుఁ జేసెనే సత్యవతీ ॥ 6

కం. చేతం దెచ్చితి వెంతో
ప్రీతిం బరమామృతమ్ము వేఁగొన నైతిన్
వాత శని పిలిచియుండఁగ
నా తలవ్రాలిట్లు పొసఁగెనా సత్యవతీ ॥ 6

కం. కనులుండఁగ నాకిట్టుల
ఘనముగ నంధత్వ మబ్బెఁగా బుద్ధియుఁ ద
ప్పినచందము వాటిల్లెడిఁ
గనుకట్టో కలయొ తెలియఁగా సత్యవతీ ॥ 6

కం. ఎక్కడి చక్కని కన్నియ
వెక్కడి మక్కువలు మనల కెక్కడి నేస్తం
బెక్కడి చింత యివన్నియుఁ
నక్కటకట కలవరింతలా సత్యవతీ॥ 70

కం. భావమునఁబుట్టి పెఱఁగిన
యావనితా నాదుమెప్పు లొప్పఁగ విని నీ
త్రోవలసేవల నన్నిడి
భావముననె మాయమైతివా సత్యవతీ॥ 71

కం. చెలిమిని మఱవకుమా మఱి
తలఁచినపుడు హృదిని నిలిచి దయ మీఱఁగ నా
కొలువులు గొనుమా కట్టిడు
మలు పుట్టిన నన్నుఁగావుమా సత్యవతీ॥ 72

కం. అనురణము నీ స్మరణము
నామదిలో నిల్పి నీ ఘనంబగు సూక్తుల్
పామరులకుఁ బండితులకుఁ
బ్రేమ నలరఁ బల్కుచుందు విను సత్యవతీ॥ 73

కం. ఇల్లాలు లేని మనుజుని
యుల్లము కల్లోల మొప్పియుండ దదెందుఁ
గల్లటనె కురులు దువ్వెన
పల్లులచేఁగాదె చక్కఁబడు సత్యవతీ॥ 74

కం. ఈడుగ జోడుగ నుండెడి
చేడియ సతియైన సుఖము చేకుఱుఁ బది కొం
డేడుల కన్నెకు ముదుసలి
వాఁడు మగండైన నేమి పస సత్యవతీ ॥ 7

కం. భూలోకము స్వర్గమ్మగు
నాలు సుశీలగను నాపె యట్టిట్టిదొ గ
య్యాళిదొ కా నీ జన్మము
చాలుననుచుఁ దోఁచుఁగాదె సఖి సత్యవతీ ॥ 7

కం. చదివిన సతి పతి కొనరుచు
ముదమింతని చెప్పఁదరమె భువి విద్యాసం
పదయట్టిది వేశ్యాంసు గ
లదె తలఁపందలఁప మగువలకు సత్యవతీ ॥ 7

కం. సతితో ముచ్చటలాడని
బ్రతుకును జత భోజనమ్ము వలదను బ్రతుకున్
సతినిఁ దనదాసిగాఁ గను
బ్రతుకును నివి బ్రతుకులే ధరన్ సత్యవతీ ॥ 7

కం. మానము సద్గుణలతకుఁ బ్ర
సూనము పతిభక్తిసౌధ సోపానము న
మ్మానమె గౌరవ మంద వి
మానమ్మగు మానినులకు మహి సత్యవతీ ॥ 7

కం. విడఁజాలరు చెడు భార్యల
విడిచిను లోలోనఁ జింత విడువరుగా యీ
పుడమిపయిఁ బడఁతి వలపునఁ
బడుకష్టము లేల చెప్పవలె సత్యవతీ॥ 80

కం. వెలయాంధ్ర వివాహమ్ములు
కులకాంత పలాయనములు కోమటి జన్న
మ్ములు బాపనసంకరములు
కలియుగమునఁ గానవచ్చెఁగదె సత్యవతీ॥ 81

కం. చిన్నదభినయము సేయఁగ
నన్నలు తాళమ్ము వేయ నే మేలనఁగా
కన్నయ్య లజ్జవిడి యిట
లున్నవి మేళమ్ము లెన్నియో సత్యవతీ॥ 82

కం. కొందఱు గాననిధులు మఱి
కొందఱు గానామృతమ్ము గ్రోలెదు వా రా
నందముఁ దెలుపఁగ సభలం
దందఱుఁ దలయూచువారె హా సత్యవతీ॥ 83

కం. వారల వీరల వంకల
నేరుం గనుగొంద్రుగాని యెఱుఁగరు తమలో
నేరములను గుఱివెందల
కారయ తమ నలుపు తెలియునా సత్యవతీ॥ 84

కం. అందిన జుట్టుం బట్టుదు
రందనిచోఁ గాళ్లఁ బడుదు రటు దుర్మార్గుల్
ముందు పడఁద్రోయఁ గడఁగియు
నందురు తుది దాసులమని హా సత్యవతీ ॥ 85

కం. పగవట్టిన త్రాచును జం
పఁగఁగన సది కఱచి యముని పాల్సేయునుగాఁ
బగతురకుఁ దొలఁగి న్యాయ
మ్మగు పథమున మెలఁగు టొప్పదా సత్యవతీ ॥ 86

కం. పల్కఁ బలు ప్రియము లెదుటను
జుల్కన దూషించుఁ జాటుచోటులు గని యే
నాల్కలు గుక్కల కీవలెఁ
జీల్కలుగాఁ జేసి వానిఁ జెలి సత్యవతీ ॥ 87

కం. ఒరులను దూషించుట యో
గిరమగుఁ గొందఱికి నొరులకీర్తుల వినసం
బరమెంతో కొందఱికిఁ గా
ధరదూషణ పెఱిగి ప్రాకుఁ దమి సత్యవతీ ॥ 88

కం. భూషణ యెవ్వారికిఁ బరి
తోషము గావించుకతనఁ దొడఁగరె పొగడన్
వేషధరులు తమ పనుల న
శేషము నెరవేర్చుకొనఁగఁ జెలి సత్యవతీ ॥ 89

కం. కలవారుం గలవారికె
కలుగనివారలునుగూడఁ గలవారికె యీఁ
గలవారు చూడఁ జూడం
గలియుగధర్మము లిట్లుకా సత్యవతీ॥ 90

కం. నగలు స్వలువలు గని పె
ద్దగ సన్మానింతు రెవని ధర నరుచా మే
లుగొనముఁ బరికించుట మొ
ప్పగసాలెది సాలెదియు నహా సత్యవతీ॥ 91

కం. ధనముండు నప్పుడందఱు
తనమిత్రులె ధనము పోవుతఱిఁగా వారల్
తనద్రవ్యమునకు మిత్రులొ
తనమిత్రులొ తెలియవచ్చు ధర సత్యవతీ॥ 92

కం. ఇడుమలు వాటిల్లఁగఁ దా
గడుధైర్యముఁ బూని వానిఁ గడచు నెవండా
తఁడె ఘనుఁడు కలదు వానికి
కడపట జ్ఞానము సుఖము గన సత్యవతీ॥ 93

కరి. అందల మెక్కెడి కోరిక
ముందుగ నందలము తామె మ్రోయందగునా
ఉందురు నీచపుఁ గొలువులఁ
గొందఱు యధికార మాసగొని సత్యవతీ॥ 94

కం. ఇచ్చుట నచ్చుట ననవుడు
నెచ్చోఁ గానంగఁబడక యేమూలను తా
ముచ్చువలె డాగి చిక్కును
లచ్చి కను న్నిచ్చి దాసులకు సత్యవతీ ॥ [illegible]

కం. శునకముఁ బాలం బెంచినఁ
దనయొడయనిమూతి నాకి తనవిశ్వాస
మ్మును దెల్పుఁ బ్రేమ మానుష
శునకమ్ములఁ బెంచఁ గఱచుఁజుమి సత్యవతీ ॥ [illegible]

కం. అప్పిచ్చి కొంప త్రవ్వఁగఁ
జొప్పడు నవ్వారు ద్రవ్యసూకరములు వా
రెప్పుడు వృద్ధింగానఁగాఁ
గుప్పలపాలౌట క్రొత్తకో సత్యవతీ ॥ [illegible]

కం. ధర్మముసేతురు గొందఱు
ధార్మికులును డంబమందుఁ దమిఁగాని కాదే
మర్మము గన వారలకుం
బేర్మియు బిరుదులును దొరకవే సత్యవతీ ॥ 98

కం. పరమార్థముఁ బరతత్వముఁ
బరలోకముఁ జింతఁగొనఁడు పామరుఁడు ధరన్
సిరులెల్లఁ దిరంబని గుల
కరాళ్ల నేఱికొను బుద్ధిగతి సత్యవతీ ॥ 99

మత భేదమ్ములఁ గొందఱు
హితభావము వీడియుందు రిది యెంతయు వె
ఱ్ఱితనమ యీశ్వరునకు స
మ్మత మొక్కటె భక్తి చంద్రమతి సత్యవతీ ॥100

జుట్టుం బొట్టుం గట్టుం
బట్టియ చేకుఱునె ముక్తిపథము తలంపన్
వట్టి భ్రమ ముక్తి చేతం
బెట్టఁగలది భక్తి యొకటె విను సత్యవతీ ॥ 101

చదువంగనేమి చదివిన
యది చక్క గ్రహించి సారమంతయుఁ బీల్చం
బొదలును జ్ఞానము మెదడున
నది లేనిది తేనెతుట్టెయగు సత్యవతీ ॥ 102

వెలి దేశములకుఁ బోవఁగఁ
గులమని భయపడుచు మానుకొందురు మనవా
రలు పెక్కురు వారికి జత
గలదుగ కూపస్థమండుకము సత్యవతీ ॥ 103

కబ్బములఁ గవుల కంపిన
నిబ్బరముగఁ దెల్పరెపుడు నిజమును మఱి వా
రుబ్బింతురు పద్యమ్ములఁ
ద్రబ్బిడి నిజమాడ నిష్ఠురమొ సత్యవతీ ॥ 104

కం. నిలువెత్తు ధనము వోసిన
నిలువెత్తు ధనమ్ము వోయు నృపతులకోర్వన్
బలమగు వైరము గలిగినఁ
బలుకఁగవలె నిజము సుగుణవతి సత్యవతీ॥ 105

కం. సత్యమునఁ బ్రీతి జనులకు
సత్యముననె కీర్తిగాన సరసులు నీసాం
గత్యము గోరియు వెలయుదురు
నిత్యము నీ స్మరణ మాననే సత్యవతీ॥ 106

కం. శంకింపక శత్రులపైఁ
గింకరులం ద్రోలి హృదినిఁ గరలితి రొట్టాల్
వేంకటసుబ్బారాయని
కింకెట్లు విపత్తు గల్గునే సత్యవతీ॥ 107

కం. అతులితమగు కవితాచతు
రత లేకయు నీ సుహృదయురాగనుహేము
శతకము రచియించితి నిదె
హితకము గైకొని ధరింపవా సత్యవతీ॥ 108

సంపూర్ణము.

